సంపుటము 1] ఏప్రిల్ 1915 [సంచిక 10

# బాలమిత్ర

## పరోపకారముచేసిన చిన్నబాలిక



ఒకానొక దేశమందు ఒక యుద్ధవీరుడు గలడు. ఒక సారి అతడు ఒక యుద్ధములో చాలా గాయములు పొంది కర్రమీద నడుచుచు తన స్వంతయింటికి వెళ్లుచు మధ్య నొక గ్రామమందున్న సత్రమునొద్ద పడిపోయెను.

దగ్గర నెవరున్ను ఉపచారము చేయువారును సహాయము చేయువారును లేక చాల బాధపడుచు దుఃఖించుచుండెను. ఇట్లు కొన్నిదినములనుండి కష్టపడుచుండెను. ఆ దారిన నొక బాలిక ప్రతిదినము బడికి పోవుచు ఆ రోగిని చూచుచు జాలి గలిగి, ప్రతిదినము రెండు డబ్బులవంతున ఆయనకు ఇచ్చుచుండెను. ఇట్లు ఆ బాలిక ప్రతిదినము నిచ్చుచుండగా ఒక దినము ఆయన దీనముఖముతో ఆ పిల్లవంక చూచి, "అమ్మాయీ! నీవు ప్రతిదినము రెండు డబ్బులవంతున నాకిచ్చుచున్నావు. మీ తల్లిదండ్రులు చాల బీదవారుగా నుండి ఒక చిన్న గుడిసెలో నివసించుచున్నారే! నీ వెక్కడనుండి ఈ డబ్బులు తెచ్చుచున్నావు?" అని అడిగెను. అంత నా చిన్నది వాని ముఖము చూచి, "అయ్యా నీ వన్నట్లుగా మా తల్లిదండ్రులు పేదవారే. నాకు ప్రతిరోజు రెండు డబ్బు లిచ్చుటకు శక్తిలేదు గాని నేను ప్రతిదినము బడినుండి ఇంటికి వెళ్లిన తరువాత పొలమునకుపోయి బుట్టెడు రేగుపండ్లు కోసికొని వచ్చి, సాయంత్రము బడికి తీసికొనివెళ్లి బడిలోని పిల్లలకు రెండు డబ్బులకమ్మి యా సొమ్ము మీకు ఇచ్చుచున్నాను. ఈ సంగతి మా తల్లిదండ్రులకు తెలిసేయున్నది." అని పలికెను. ఈ మాటలు విని ఆయన చాలా దుఃఖముతో ఆమెవైపు చూచెను. ఆ పిల్ల బడికి వెళ్లిపోయెను. ఇంతలోగా మరియొకడు

ఆ గారిని గుఱ్ఱముపై నెక్కి వెళ్లుచు గుఱ్ఱమునకు నీళ్లు పెట్టుటకు సత్రముయొద్ద దిగి పరుండియున్న రోగిని ఆ పిల్లను చూచెను. "ఈ చిన్న పేదపిల్ల యింత మేలుచేయగా నే నెందుకు ఈయనను ఆదరించకూడదు." అని తలచి సత్రము యొక్క పెద్దను చూచి "అయ్యా ఈయనను బాగుగా చూడుము. ఈయనకు అగు ఖర్చు యావత్తు ఇప్పుడే యిచ్చెదన"ని పైక మాయనకిచ్చి వెళ్లిపోయెను.

మన నడతవల్ల యెవరి కెట్టిమేలు కలుగునో మనకు తెలియదు.

## గాడిదె నీడ

అమరావతియను గ్రామములో గోపాలుడను నొక్క బాలుడు కాపురముండెను. ఒక వేసవికాలమునాటి ఉదయమున వాడు పొరుగూరికి వెళ్ల తటస్థించెను. అది కొంచె మెక్కువ దూరముగా నుండెను. గాన అతడు చాల పెందలకడనే లేచి బయలుదేరినను, మధ్యాహ్న మగునప్పటికి చాలదూరము ఇంకా పోవలసి యుండెను. ఆ యెండకు పైన నెత్తియు, క్రింద కాళ్లును మలమల మాడిపోయెను. ముందుకు పోవుటకైనను వెనుకకు తిరుగుటకైనను వానికి మనస్సు రాలేదు. విశ్రమించుటకా, దగ్గిర ఒక చెట్టైనను

లేపాయెను. ఇంతలో వాని అదృష్టము పండినట్టుగా చాకలి కుఱ్ఱవాడొకడా మార్గముననే ఒక గాడిదను దోలుకొని




పోవుట కనుబడెను. దానిపై మూట లేవియు గానరాకుండుటచే, గోపాలుడు చాల సంతోషించి, వాని త్వరత్వరగా సమీపించెను.

“ఒరే, చాకలీ! ఎక్కడకురా పోతున్నావు?” అని గోపాలు డడిగెను.

చాకలి:—“నేనాండి? నేను అల్లదిగో ఆ ముందున్నపల్లె కెళ్లుతున్నాను. మాయిల్లాడనే వుంది.”

గోపా:—“మంచిది. నేనుగూడా అక్కడకే వెళ్లుచున్నాను. ఇప్పుడు చాల ఎండగా ఉన్నది. నేను నడవలేను.

నన్నీ గాడిదమీద నెక్కించుకొని తీసుకుపోతే
రెండణా లిచ్చుకొంటాను. ఎక్కనా?"

చాకలి:—"మూణ్ణా లియ్యండి బాబూ. ఇంకా మూడు పరు
గులు బోవాలి. అయితేనే యెక్కండి. లేకుంటే
మావాళ్లు నన్ను రెండేస్తారు."

గోపాలుడు పైన సూర్యుని, క్రింద కాలుచున్న భూమిని, దూరమున నున్న ఊరిని చూచి, మూడణా లియ్యవచ్చునని యెంచి సరేనని గాడిదెమీద ఎక్కి కూర్చుండెను. చాకలి కఱ్ఱ డొక గోగుబెరికె చేతపట్టుకొని, ధడీబిడీ నాలుగేట్లు వేయుచు గాడిదెను తోలుకొని పోవుచుండెను. కాలము గతించినకొలది, ఎండయు యెక్కువగుచుండెను. గాడిదెమీద కూర్చుండుటకుగూడ గోపాలునకు కష్టముగా నుండెను. ఎండకు శరీరములో నున్న నీరంతయు పైకి పొరలి పొరలి వచ్చుచుండెను. దాహమునకు నాలుక పిడుచగట్టుకొని పోవుచుండెను. ఎక్కడ చూచినా ఒక చెట్టుగాని పుట్టుగాని కంటికి గానరాలేదు. ఇంక కొంచెముసేపు గాడిదెమీద కూర్చుండిన యెడల పై ప్రాణము పైనే పోవునని తలంచి, చాకలిని గాడిదె నాపుమనెను.

చాకలి:—"ఎందుకు బాబూ, గాడిదనాపేది. చుఱ్ఱుమని
కాళ్లు కాల్తున్నాయి."

గోపా:—«ఓరే, నేనింకా దూరము పోలేను. గాడిదెనీడలో కొంచెముసేపు విశ్రమించాలి»

చాకలి:—«బలేబాగున్నది. ఈ యెండలో యిక్కడ నిలబడితే గాడిదనీడను మీరు కూసుంటారా? ఎట్లా కూసుంటారు? ఎక్కిపోడానికి మీరు డబ్బిచ్చారేగాని, నీడకేమైనా యిచ్చారా?»

గోపా:—«ఏమిరా, నోరు కొవ్వినదా? అట్లా మాట్లాడుతావు. నీడను కొంచెముసేపు విశ్రమించవలెనంటే»

చాకలి:—«ఏందియ్యో! మాటలు బాగా రానియ్యండి. గాడిదనాది. దాని నీడనాది. మీకు కావలిస్తే గాడిద మీద కూరోచ్చోండి. నీడమీద మీకేమిలేదు నేను దాని నీడను కూసుంటాను»

అని ఒకరితో నొకరు వాదించుచు, పోట్లాడుకొనిరి తరువాత మాటలు దాటి, వారు జుట్లుజుట్లుపట్టుకొని నీడకొరకు ఒకరి నొకరు నెట్టుకొనిరి. ఇంతలో గాడిద ఆ యెండకు నిలువలేక మెల్లగా అక్కడనుండి సాగి, దౌడుతీయుచువచ్చి ఊళ్లోపడెను. వారు పోరాడుకొని నీడకొరకు చూచుకొను వరకు అక్కడ నీడగాని గాడిదగాని ఏమియులేదు.

పిల్లలారా చూచితిరా! ఇది మీకేమి నీతి బోధించుచున్నది!

పోరాడుట పిచ్చితనముగాక మరేమియుకాదు. పోట్లాట అయినపిదప, ఎందుకు పోరాడినారో చూచుకొనుడి. కారణము కనపడనే కనపడదు.

---

# ప్రకృతి పాఠములు

9-వ పాఠము

## విత్తనములు

పండ్లనుగూర్చి పోయినసారి వ్రాసినప్పుడు విత్తనములను గూర్చికూడా కొంచెము చెప్పియుంటిని గదా! ఇప్పుడింకా యెక్కువ వ్రాసెదను. మొక్కలు సాధారణముగా విత్తనములనుంచి మొలచును. ఇవి మొలకెత్తుట చాల విచిత్రము. తోటమాలులును, కాపులును విత్తనములు భూమిలో నాటెదరు. మొలక బైటకు వచ్చుటయు, ఎదుగుటయు, పుష్పించుటయు, కాయలు గాచి పండ్లగుట యివి యన్నియు చూతురు. గాని ఇదంతయు, వారి కేమియు చిత్రముగా నుండదు. వారి తలంపంతయు పంటమీద నుండును గాన ఈ విషయ మెట్లు కలుగుచున్నదో దానిని గూర్చి తెలిసికొనుట కంత యిష్టములేదు.

ఒక చిక్కుడుగింజను భూమిలో నాటుము. దానినుండి తీగ బయటికివచ్చి ఆకులువేసి పందిరిమీదకు ఎక్కి, కొంత కాలములో అంతయు వ్యాపించును. ఇంక కొన్ని దినములకు పుష్పించును. తరువాత పిందెలు కాయలు పుట్టి వానిలో, నీవు మొదట వేసిన గింజల వంటివి వేలకొలది వచ్చుట చూతువు. ఇవన్నియు ఒక్క విత్తనమునుండేగదా వచ్చినది. గింజలుగాక తక్కిన వేవియైనను గింజవలెనున్నవా?




వేపచెట్టుమీదనుండి పండొకటి క్రిందపడినది. అది ఎవరి కాలిక్రిందనో బడి భూమిలోకి పోయెను. వర్షము కురిసిన వెనుక దానినుండి మొలకపుట్టి పెరిగి కొన్ని సంవత్సరములలో పెద్ద చెట్టయినది. ఈ చెట్టు, క్రిందపడిన విత్తనమువలె నున్నదా? ఇదంతయు నెట్లు కలుగుచున్నది?

విత్తనము భూమిలో పడినపిదప దానిలోనున్న తేమను

పీల్చుకొనును. తరువాత విత్తనము ఉబ్బి కొంచెము పెద్దదిగా కనుబడును. విత్తనము యొక్క పైపొరచినిగి దానిలోనుండి ఒక చిన్న వేరు వెడలివచ్చును. ఇది భూమిలోనికి చొచ్చుకొని పోవును. ఇంకకొంతకాలమునకు విత్తనములోనుండి చిన్న కాడ యొకటి పైకివచ్చినట్లు కనుబడును. ఇది భూమిపైకివచ్చి ఆకులు వేయును. వేరు క్రింది కేలాగుపోవునో, కాడ పైకేలాగువచ్చునో ఎవరికిని తెలియదు. అనేకు లనేక కారణములూహింతురుగాని ఊహలు అన్నియు నిజములు గానేరవు. విత్తనమును భూమిలో ఏరీతిగా పెట్టినను, వేరు భూమిలోనికిని, కాడపైకిని వెళ్లును. వేరొకవిధ మెప్పటికిని జరుగదు.

వేరు భూమిలోనికి చొచ్చుకొనిపోవుటకు, చాల ప్రయాసపడుచున్నట్లు కనుబడును. ఒక రాతిగోడలో బడిన విత్తనమొకటి మొలచెను. కొంతకాలమువరకు అది పెరిగెను, ఆ గోడయందు దాని కాహారము చాలకపోయెను. వ్రేళ్లు బయటికివచ్చి నలుదిక్కులు వెళ్లుట గుర్తించిరి. చెట్టు వాడిపోవునట్లుగా కనుబడెను. గాని దాని వ్రేళ్లలోనొకటి క్రిందకు దిగి భూమిలో నాటుకొనెను. తరువాత ఆ చెట్టుకు కావలసిన ఆహారము దొరికినందున బాగుగా ఎదిగినది.

విత్తనములలో నాలుగు భాగములున్నవి. 1. పైకప్పు 2. పప్పుబద్దలు, 3. వేరు 4. కాడ.

పైకప్పు కొన్ని విత్తనములలో సన్నగానుండును గాని కొన్నిటిలో చాల గట్టిగానుండును. మామిడి, బాదము, రేగు మొదలగు విత్తనముల చూడుడి. ఇవన్నియు గట్టిగా నుండును. పప్పుబద్దలు చెట్టు తనంతట తాను బ్రతుకువరకు మొక్కను పోషించును. వేరును, కాడయును కలిసి కంటికి కనబడనంత చిన్నవిగా పప్పుబద్దల నడుమనుండును. వీటికి దగ్గరగానే వేరు బయటకు వచ్చుటకు రంధ్ర మొకటి యుండును. ఇదియు కనబడదు. గాని విత్తనము నీటిలో నానవేసి దానిని వత్తిన యెడల దానినుండి నీరువచ్చుట చూడవచ్చును.

విత్తనమెంత చిన్నదైనను దేవుడు దాని నెంత చిత్రముగా చేసెనో చూడుడు. మీరు మంచి పిల్లలైన యెడల ఈ సంగతులనుగూర్చి మరెక్కువగా చూచుటకును తెలిసికొనుటకును కోరుదురు. మీ ఉపాధ్యాయులను అడుగుడి. వారు విత్తనములనుగూర్చి మీ కనేక చిత్రసంగతులను చెప్పెదరు.

# సంభాషణ



ప్రకాశము, సూర్యనారాయణ అను ఇద్దరు స్నేహితులు
కలసి సంభాషించుచున్నారు.

ప్రకా:—ఏమయ్యా! సూర్యనారాయణా! మూడు దినముల నుండియు మీరు కనుపించుటలేదు. ఎక్కడికి వెళ్లియుంటిరి?

సూర్య:—ఎక్కడకును వెళ్లలేదు గాని మా ఇంటిలో ఒక దుఃఖకరమైన సంగతి జరిగినందువలన రాజాలకపోతిని.

ప్రకా:—స్నేహితుడా! ఆ విచారకరమైన సంగతి ఏమో నాతో చెప్పుము, నీ విచారము తొలగించెద.

సూర్య:—ఏమి చెప్పెదనయ్యా! మాకు ఒక్కతె చెల్లెలు గలదు. ఆమెను చిన్నతనమునుండియు నే నెక్కువగా

ప్రేమించితిని గాని, నిన్నటిదినము అకస్మాత్తుగా జ్వర ముచ్చి చనిపోయినది. అందువల్ల రాజాలకపోతిని.

ప్ర కా:—స్నేహితుఁడా మీరు ఇంతమాత్రమునకే విచార ముగా నున్నారా. భయపడకుడి మీ చెల్లెలు మీకు కనబడును. మీరుకూడా నొక సమయమున మీ చెల్లెలు వెళ్లిన స్థలమునకు వెళ్లవలసి యున్నారు.

సూర్య:—ఆహా! నిజముగా నా చెల్లెలు వెళ్లిన స్థలమునకు నేనుకూడా ఇప్పుడువెళ్లి ఆమెతోకూడా నున్న యెడల నాకెంత సంతోషము!

ప్ర కా:—అయ్యో! స్నేహితుఁడా నీ వెంత పిచ్చివాడవయ్యా. నీవు వెళ్లుట నీ స్వాధీనములో లేదుగాని, దేవుని స్వాధీనములో యున్నది. వెళ్లుటకు సిద్ధముగా నుండుట నీపని.

సూర్య:—స్నేహితుఁడా? సిద్ధముగా నుండెద గాని ఇది వరకు ఎవరైనా చనిపోయి తిరిగి లేచినారా?

ప్ర కా:—ఏమయ్యా! ఇంతకాలము నుండియు నీవు బడిలో క్రీస్తు బోధలను గూర్చి వినియుండలేదా? లోకము లోని ప్రజలందరు పాపములో బడియుండగా ఆ పాపమును తొలగించుటకు క్రీస్తు ఈ లోకమునకు వచ్చి మన పాపములకు బదులుగా తానే తన్ను తా

నర్పించుకొని సిలువ మరణమునొంది తిరిగి మూఁడవ నాఁడు లేచెనుగదా?

సూర్యా:—ఆహా! అట్టి పుణ్యాత్ము లున్నారా? వారు తిరిగి లేచి యెవరికైన కనబడియున్నారేమో జెప్పుము?

ప్రకా:—చెప్పెదను వినుమయ్యా! ఆయన సమాధినుండి మూడవనాఁడు లేచి మొదట మగ్దలేనే మరియకును, యాకోబు తల్లియైన మరియ సలోమి అను స్త్రీలకును పదునొకొండుమంది శిష్యులకును ఎమ్మాకు పోవు ఇద్దరికిని కనుపించి వారితో మాట్లాడెను. మరియు తన శిష్యులతో కలసి భోజనముచేసి కొంతకాలముండి వారికొకపని అనగా మీరు సర్వలోకమునకు వెళ్లి సర్వసృష్టికిని సువార్త ప్రకటించి నా శిష్యులనుగా చేయుడి అని చెప్పి ఆకాశమునకు ఎక్కిపోయెను.

సూర్యా:—అట్లయిన స్నేహితుఁడా! నా చెల్లెలుకూడ కొంతకాలము ఈ లోకములో నుండునా?

ప్రకా:—ఈ లోకములో కాదు గాని మీ రిద్దరు దేవుని ఆజ్ఞప్రకారము నడుచుకొని యున్నయెడల మోక్షమునకు వెళ్లి అక్కడ సంతోషముగా ఉండగలరు గాని ఇక్కడ నుండుటకు వీలు కాదు.

సూర్య:—దేవుని ఆజ్ఞప్రకారము నడువనియెడల ఏమి సంభవించును?

ప్రకా:—ఏమి సంభవించునా? నీవు ఒక స్థలములో నీ చెల్లెలు ఒక స్థలములో నుండవలసి వచ్చును.

సూర్య:—ఆ రెండు స్థలములేవో చెప్పుము

ప్రకా:—ఆ రెండు స్థలములా? మోక్షము, నరకము అనునవియే.

సూర్య:—స్నేహితుండా మోక్షమునకు పోవుటకు ఎట్టివారై యుండవలయును. నరకమునకు పోవుటకు ఎట్టివారై యుండవలయును.

ప్రకా:—మోక్షమునకు పోవువారందరు దేవునియందు భయభక్తులుగలిగి నీతిమంతులును విశ్వాసవంతులైన యెడల మోక్షములో ప్రవేశింవగలరు. కాని దేవుని ఆజ్ఞను మీరువారందరు నరకమునకు పోదురు

సూర్య:—అయ్యో! అయిన నేను నా చెల్లెలును చూచుటకును నా యాత్మను రక్షించుకొనుటకు నికమీదట దేవుని యాజ్ఞప్రకారము నడుచుకొనెదను.

ప్రకా:—నీ వట్లు నడుచుకొనుటకై ఒకటేమార్గము చూపించెద. అదేదన ఈ బైబిలు చదివి మారుమనస్సుపొంది దేవునితట్టు తిరుగుటయే.

సూర్య:—అట్లయిన ఆ పుస్తకము నాకు దయచేయుడు
ప్రకా:—ఇదిగో పుచ్చుకొమ్మని తనచేతిలోని బైబిలును ఇచ్చెను.
సూర్య:—మీ మేలు నేను మరువకుండా ఈ పుస్తకమును చదివెదను సెలవిచ్చెదరా?
ప్రకా:—ఆ! సంతోషముతో సెలవిచ్చెదను. దేవుడు మిమ్ము కాపాడుగాక!

## బాలమిత్ర టపా

నా ప్రియమైన బాలమిత్రులారా!

నేను తెలియ వ్రాయు సమాచారము ఏమనగా, మేము దేవుని ఆశీర్వాదమువల్ల క్షేమముగనే ఉన్నాము. నేను చర్చిమిషన్ బాలికాపాఠశాలలో నాలుగవ క్లాస్‌వరకు చదివి, నిలిచిపోతిని. నేను ఇప్పుడు ఇంట్లోనే అయ్యవారమ్మ వద్ద, ఇంగ్లీషు, తెనుగు, అరవము, ఇవన్నియు చదువుకొనుచున్నాను. చమికీపనులు కూడా కుట్టుచున్నాను. హెయ్‌బెర్‌క్ దొరసానమ్మగారు నెలకొకతూరి పరీక్ష చేయుచున్నారు. నేను మద్రాస్, సెన్‌ట్రల్ స్టేషన్‌లో ఉన్నాను. నా వయస్సు 14 సంవత్సరములు. నాకు ఇద్దరు అన్నలు, ఇద్దరు తమ్ములు, నలుగురు చెల్లెండ్రు. మా తండ్రిగారున్ను, మా తల్లిగారున్ను




క్షేమముగనే ఉన్నారు. మా తండ్రిగారు డాక్టర్ పని చేయుచున్నారు. మేము హిందువులము. నా ప్రియమైన అక్కగారిని పోయిన సంవత్సరము ఆగస్టునెల 23-వ తేదిని పరమతండ్రియగు దేవునికి అప్పగించితిని. మా అక్కగారు చనిపోయిన దానివల్ల మా కందరికి వ్యసనముగా నున్నది. దానివల్ల బాలమిత్ర టపాకు ఇన్ని దినములుగ జాబు వ్రాయక పోతిని. ఇంతే మీకు నా ప్రియవందనములు.

ఇట్లు

మీ స్నేహితురాలగు

వి. కోదనాయకమ్మ, సెన్ట్రల్ స్టేషన్, మదరాసు

C. L. S. PRESS, MADRAS—1915